శ్రీరస్తు.

# మహానందీశ్వర స్తోత్రము.

ఇది,

కర్నూలు తాలూకా తడకనపల్లె గ్రామములో

శ్రీ రామబ్రహ్మ మఠాధిపతులయిన

## శ్రీ వీరదాసుగారిచే

ప్రచురింపబడి,

కర్నూలు

చంద్రమౌళీశ్వర ముద్రాక్షరశాలయందు

యస్. వి. రామయ్యగారిచే

ముద్రింపబడెను.

1911.

(వెల 2½ అణా.)

సీ. ఆదిమధ్యావసానాభి—శూన్యంబైన
పరచిదాత్మునిచేత—భవము నభము
దివికి జన్మించెను—పవనము పవనసం
భవమాయె పావకు—పావకమున
జలముద్భవంబాయె—తెలియగా జలమున
భూమిసంభవమాయె—భూమివలన
కరమర్థి జన్మించె—కలజీవకాయముల్
నిఖిలజీవుల కెల్ల—నేత్రమందు

గీ. నీలపాండురరక్తపటీర—ములరుపీత
రీతిపంచభూతమున—వర్ణితతినిగాను
బుధులజెప్పెద రిభ్భంగి—భూతలమున
లీలహృద్వర్తి—మహానందిలింగమూర్తి. ౨.

సీ. రక్తవర్ణముభూమి—రాజపితానుమా
కతెనస్వభావసం—గతిని వెలయు
శ్వేతవర్ణముబట్టి—వెసద్రవంబైనీరు
వలనొప్పవిష్ణు—నివాసమయ్యె
కృష్ణవర్ణముబట్టి—యుష్ణస్వభావమై
వీతిహోత్రమురుద్ర—నివేశమయ్యె
వర్ణంబుధూమ్రమై—వాయువచలనస్వ
భావంబునీశ్వర—భవనమయ్యె

గీ. దివియవర్ణంబుపీతమై—తేరలుగూడి
బలుసదాశివనిలయంబు—పంచభూత
వర్ణమధిదేవతా—గుణవర్తనంబు
లీలమ్రొద్వర్తి—మహానంది లింగమూర్తి. 3.

సీ. వరగంధరసరూప—స్పర్శశబ్దంబులు
భూసంగతములైదు—పాలుపుమీర
రసరూపసంస్పర్శ—రహిశబ్దమీనాల్గు
జలభూతగుణములు—జ్వలమగాను
రసవిరూపస్పర్శ—శబ్దంబుమూడివి
నగ్నిభూతగుణంబు—లమరియుండు
చారుతరస్పర్శ—శబ్దంబురెండివి
వాయుభూత—స్వభావంబులగును

గీ. దివికిశబ్దంబుగుణమది—దెలియనాకటి
ఘనమహాభూతగుణములు—గాగధాత్రి
సమతజెప్పెడివిజ్ఞాన—శాస్త్రసరణి
శిలహృద్వర్తి—మహానందిలింగమూర్తి. ౪.

సీ. గ్రక్కునదివి రెండు—ప్రక్కలై రమియింప
ష్టాతృజన్మించెను—ష్టాత నాల్గు
భాగంబులై వాయు—పావకజలధాత్రి
జెందమనోబుద్ధి—చిత్తమహము
సంభవించెను వాయు—సఖము వాగ్ఘ్రాణంబయ్యె
నర్ధాంశగూడెను—నాలుగింట
దివినగ్ని జలధరోద్భవము—సమానంబు
దానంబపానంబు—ప్రాణమయ్యె
శిఖిసర్ధభాగంబు—చెక్షుస్సులనకడ
మర్ధభాగము—చతుర్థాంశలయ్యె
గగనమారుతి కాండ—జగతినందులగూడి
వినులుత్పత్తింపవా—వినుతిఘ్రాణ
గీ. మయ్యెపానియ్యె—మర్థాంశమయ్యెరసము
నర్ధభాగంబు—గలిసెను నాలుగింటు
గలిసె శబ్దంబు—సంస్పర్శ గంధరూప
లిలిహృద్వర్తి—మహానంది లింగమూర్తి. ౫.

సీ. పాయువుపృథివి—సంభవమాయనర్థాంశ
మందులోనర్థాంశ—మయ్యెనాల్గు
పాయలైనంబర—పవమానములగూడి
శిఖిసలిలంబుల—జెందెరెండు
నాల్గిటవాక్పాణి—నతపాదగుహ్యంబు
లాయజీవాదృష్ట—నాశ్రయమునను
పంచవింశతితత్వ—భావంబులివియని
పరతత్వశాస్త్రముల్—పలుకుచుండు

గీ. దివికినైదునుమారు—తోద్భవములైదు
ననలమునకైదు—పానియ్యమునకునైదు
పృథివికినినైదు—నివిపంచవింశతియును
శీలహృద్వర్తి—మహానంది లింగమూర్తి. ౬.

సీ. మానితశ్రోత్ర—సమానమంటియు దేవుల్
శబ్దంబు గాంచి—వాక్చయము బుట్టు
మనసు వాయ్వనము—చర్మమాన స్పర్శ గాంచియు
కరతలంబుల—క్రియాఘటన మొనయు
శేముషీ వానంబు—జెంది చెక్షులరూపు
గాంచి పాదంబుల—గమన మొనయు
చిత్తము పానంబు—జిహ్వావచవి గ్రోలి
గుహ్యస్థలంబున—గూడి మెలగు

గీ. బలునహంకార—మెప్రదుం బ్రాణమునను
ఘ్రాణమునగూడి—గంధముల్ గాంచి పాయు
వునవిసర్జన—శేయుచునుండుచుండు
శిలహృద్వర్తి—మహానంది లింగమూర్తి. ౭.

సీ. ఘనమహీభూతంబు—గంధంబు గ్రోలఁగ
ఘ్రాణరూపము దాల్చి—రమణమీర
రవిజలభూతంబు—రసగుణధారుఁడై
జిహ్వారూపము దాల్చి—వెలుఁగుచుండు
అగ్నిభూతము—రూపములవడఁ గాంచుట
చెక్షురూపము దాల్చి—వెలుఁగుచుండు
పవనభూతముస్పర్శ—పరికింపసదనుఁడై
చర్మరూపము దాల్చి—వెలుఁగుచుండు
గీ. గగనభూతంబు—శబ్దంబు గాంచుటకును
తలఁపఁ శ్రోత్ర—స్వరూపము దాల్చియుండు
నివియు—జ్ఞానేంద్రియములైదు నెఱుఁగఁదలఁగా
లీలఁ హృద్వర్తి—మహానంది లింగమూర్తి. ౮.

సీ. రూఢిశబ్దస్పర్శ—రూపంబురసగంధ
విషయంబులివి—జ్ఞానవితతి కెల్ల
వాక్పాణిపదగుహ్య—వసరపాయువులివి
కర్మేంద్రియములైదు—క్రమముగాను
వచనదానాగమ—వర్గితానందంబు
విసవిసర్జనలైదు—విషయసమితి
బాహ్యేంద్రియములివి—పరగనాంతరమున
మనసుకేముపి—చిత్తమునహంబు
సమతివిచార—నిశ్చయచింత దేహాభి
మానవ్యాప్తీకరం—బులయుచుండు
జ్ఞానేంద్రియంబులు—మనసుమనీషంబు
బలునూర్ధ్వగ—ప్రకృతిగాబలుకబడియె
గీ. చిత్తమూంకార—కర్మసంశ్రేణియధమ
ప్రకృతియనియంద్రు—ప్రాజ్ఞులభవ్యమహిమ
తెలియగావలె—సుజ్ఞానదివ్యపదవి
లీలహృద్వాసి—మహానంది లింగమూర్తి. ౯.

సీ. చంద్రబింబమురీతి—నింద్రధనుచ్ఛాయ
గాఢాంధకార—సంగతివిదోచు
తటిచ్చాయలరీతి—భానుమండలభాతి
పుంనమవెంనెల—పోల్కిదనరు
వెలుగుదీపంబుల—విధములనవరత్న
కాంతిసాగరమట్లు—గలిగియుండు
దిరములుగాల్చిన—వరుసమెరుపుమురీతి
చుక్కలవలెదోచు—సూర్యుపగిది

గీ. మెరుపుమెరసినట్లు—మిణుగురుపురుగురీతి
నిండవెలసు—సాగవెలుగుచుండురీతి
కంటగనచిత్రకా—దర్శకంబుగాన
శైలపాదద్వారి—మహానంది లింగమూర్తి. ౧౪.

౫. అనువందకుసుమంబు—లందుగంధములీల
నిఖిలాత్మునకఖిలంబు—నిండియుండు
దారువందనలంబు—దాగినవిధమున
నిఖిలాత్మునకఖిలంబు—నిండియుండు
క్షీరంబులఘృతంబు—జేరియుండినరీతి
నిఖిలాత్ముడఖిలంబు—నిండియుండు
యిలసస్యములరస—హేతువచ్చందంబు
నిఖిలాత్ముడఖిలంబు—నిండియుండు

గీ. యిదవశింతంత—యనరానునఖిలమునను
నిండియుండిన—పరశివుని కథజింత
సాత్మవిజ్ఞాన—మునకూడినసుజనంబు
లీలఁబొందు శ్రీమహానందలింగమూర్తి ౧౫

సీ. రమణేంద్రియాది—వైరాగ్యంబుయమమును
నియమంబుపరమాత్మ—నిత్యభక్తి
నిహాసుఖాసక్తి—నిస్పృహాభావమాసన
మరయనిందాస్తుతు—లైనమోహ
కల్పితసిద్ధి—కలిమిత్యక్తగానెంచి
ప్రాణముల్ నిర్వాణ—పధముగూర్చ
ప్రాణసంయమమమ్ము—బరగుప్రత్యాహార
మనుభవానంద—నిజాత్మకంబు

గీ. ధ్యానమంతరలక్ష్యమున—సంధానమైన
నాత్మచిద్దృష్టి—జొనిపినధారణంబు
మరపుతెరపుల—గల్పసమాధియండ్రు
శైలకన్యాధ్వరి—మహానందిలింగమూర్తి. మ.

సీ. అష్టాంగయోగంబు—కది రాజుగా నొప్పు
రాజయోగము మూడు—ప్రకటనములు
వెంషియు సాంఖ్యంబు—వెరవున్న తారక
మమనస్కమన త్రిత—యాత్మకంబు
తెలియఁగోరినవారు—దేశికు సేవించి
పంచవింశతితత్త్వ—మెంచి సాక్షి
వస్త్వంశతిభావ—సాంఖ్యయోగంబది
తారకయోగంబు—తరణిచంద్ర

గీ. మండలంబులదర్శింప—మహిని యొప్పు
ఘననిరాలంబపద్ధతి—గాలిలేని
జ్యోతిగతిమంచయమనస్క—యోగమండ్రు
లిలహృద్వర్తి—మహానంది లింగమూర్తి. ౧౭.

సీ. ధరణిసముంచితోద్భవ—మైనవాగాది
కర్మేంద్రియంబులే—గాను గాను
అంబరోదయమైన—శబ్దాదిగంధాంత
మనువిషయంబులే—గాను గాను
కలితాగ్నిసంభూత—కర్ణాదిఘ్రాణాంత
జ్ఞానేంద్రియంబులే—గాను గాను
పవమానజన్య—ప్రభంజనంబులు గాను
గగనోదయాంతరః—కరణ గాను

గీ. గానయీపంచ—వింశతికట్టుమీది
సాక్షి నేనని—చింతింపసాంఖ్యయోగ
మగునుసద్గురు—కృపదెలియంగవలయు
లీలహృద్వర్తి—మహానంది లింగమూర్తి. ౧౭.

# మహానందీశ్వరస్తోత్రము.

సీ. మహిచంద్రసూర్యాగ్ని—మండలజ్వాలల
భాతియైనవొప్పేటి—జ్యోతివెలుగు
తప్తకృశానలగాడ్పు—చదలుభూతములైదు
యెస్తానమందైక్య—మెసకమెసగు
శుకయోగినారద—ప్రకటితసద్గోష్ఠి
కాధారమేస్తాన—మయ్యెనిత్య
మూఁడుమూర్తులుగూడి—మోదకరదంబునై
యేస్థానమందగ్ని—వెలుగువెలుగు

గీ. జగతినొక్కెడదీపంబు—సరణివెలుగు
నిద్రతృప్తులనొకవేది—భద్రమగుచు
నదియుతారకయోగంబు—నయ్యలకును
లీలహృద్వర్తి—మహానంది లింగమూర్తి. ౧౯.

సీ. పంచశక్తులఁగూడి—ప్రమథులనిక్కుచునుండు
శిఖిరూపమరయఁగ—చెక్కులందు
నీలమేఘావర—నిశ్శాలమునఁగోటి
మెఱుపులభంగి—మిర్మిట్లుఁగొనుచు
నీలవర్ణాకృతి—నెరశిసశలపురచ
కృష్ణపింగళము—కీర్తి వినఁగ
నీలతోయదమధ్య—నెగడువిద్యుల్లేఖ
యనఁగ మభాస్వర—మనఁగ వినఁగ

గీ. రీతినీవారశూకాగ్ర—పీతభాస్వ
త్యణురూపమనఁగ—శ్రుతివార్త వినఁగ
నదియుతారశరూపాంగంబు—నాయొక్కలక్షుమ
శీలహృద్వర్తి—మహానంది లింగమూర్తి.

నగా

సీ. అక్షరత్రయము—నేకాక్షరకలితమై
బరగునెచ్చటశుద్ధ—ప్రణవమగుచు
అయిదక్షరంబు—లేకాక్షరయుక్తమై
బరగునెచ్చటశుద్ధ—ప్రణవమగుచు
హైరణ్యతేజమై—అష్టాక్షరంబులే
కాక్షరమచ్చోటనై వెలుంగు
రాజసహంకార—తేజవిదూరమై
రాజిల్లునాదంబు—రాజ్యమేది
గీ. అండపిండాండబ్రంహ్మాండమండమది
షోడశాంతరకళయుండు—చోటులేది
భవసముద్రంబుదాటు—నుపాయమేది
నదియుతారకయోగంబు—నార్యులకును
లీలహృద్వర్తి—మహానంది లింగమూర్తి. ౨౨.

సీ. చలనర్గితదీప—కళికచందంబున
తన్మయత్వము పొంది—స్థైర్యమంది
రవికాంతిచేదోప—రాత్రిబాళిసరీతి
మాయాంధకార—నిర్మలత పొంది
లోకముల్ మించిన—నాకంబుభంగిని
నాదిమధ్యాంత—శూన్యత వహించి
నయనదృష్టులలీల—బయలావరించిన
సరణిమండలముల—వంగళించి

గీ. మించిసత్కీర్తిధరియించి—మెలగుహృదయ
పరచిదాకాశమునమదో—పదిలముంచి
సకలనిస్పృహమమనస్క—సరణియందు
లీలహృద్వర్తి—మహానంది లింగమూర్తి. 3.

సీ. శ్రీమత్స్మహాభాగ-శివయోగధన్యుండు
శ్రవణంబు జేయఁగ-సాంఖ్యుఁడయ్యె
తలపఁ జరాచరాం-తర్యామి విభజింప
మననంబు కారక-మార్గమయ్యె
సకలమాన్యంబైన-సరణి నిదిధ్యాస
జెందఁగ నమనస్క-చందమయ్యె
త్వంపదతత్పద-తత్త్వమసి నరయ
సాంఖ్యంబు త్వంపద-సరణియయ్యె

గీ. తత్పదంబును-తారకధామమయ్యె
నలనిరాపేక్ష-మమనస్కమసిపదంబు
మూడుమార్గము-లీరీతి ముక్తిపథము
లిలఁబ్రవర్తి-మహానంది లింగమూర్తి. ౨౮.

సీ. ధారుణీజలవంహ్ని—మారుతగగనంబు
జాగ్రదావస్థయు—నల్పునైదు
పానీయపావక—పవమానసంబర
మినాల్గుస్వప్నమై—నింపొనర్చు
వీతిహోత్రసమీర—విష్ణుపదంబును
మూడుసుప్త్యవస్థ—గూడియుండు
వాయువాకాశంబు—వలనొప్పగా రెండు
తుర్యమైనతతంబు తోడరుచుండు

గీ. నభ్రమొక్కటతీతమై—నతిశయిల్లు
చెలగునీరైదవస్థల—తెలియవలయు
నిట్టివిజ్ఞానసత్యాత్మ—నేభజింతు
లీలహృద్వర్తి—మహానంది లింగమూర్తి. ౨౯.

సీ. స్థూలకాయముభూమి—లీలఁబ్రకాశించు
జాగ్రదావస్థకు—సాక్షి నాత్మ
సూక్ష్మశరీరంబు—సోకినజలమందు
స్వప్నంబుగలుగగా—సాక్షి నాత్మ
కారణాంగంబున—కలితాగ్ని సుప్తియు
నలరగానందు—సత్యాత్మసాక్షి
తుదమహాకాయంబు—తోసమీరంబున
నలరుతుర్యావస్థ—కాత్మసాక్షి

గీ. ఘనపథంబును కైవల్య—కాయమందు
నలయతీతంబవస్థకు—నాత్మసాక్షి
తెలియవలయునీయైక్యదు—దేశికోక్తి
లీలహృద్వర్తి—మహానంది లింగమూర్తి. ౨౬.

సీ. అజుడుయకారంబు—నారయణోహంకార
సహితమైజాగ్రత—సల్పుచుండు
విష్ణువకార—సాత్త్వికహంకారంబు
ధరియించిస్వప్నంబు—జరుపుచుండు
రుద్రుండుబుద్ధిమాత్రక—మకారమునంది
తామసహంకార—మమరుసుప్తి
యీశ్వరుమానసమిద్ధ—యకారంబు
తుర్యంబుశుద్ధస—త్త్వోదితంబు

గీ. ఘనసదాశివమూర్తి—విజ్ఞానమంది
ఘనస్వహంకారమాహకార—ఘనస్వదగుచు
నతులమునతుర్యా—తీతమైచలంగు
లీలహృద్వర్తి—మహానంది లింగమూర్తి. ౨౭.

సీ. చక్రసదీపమై—నిక్కతేజస్ఫూర్తి
 బ్రహ్మాండకటాహము—బ్రబ్బింది
నేమూర్తిసంతత—మేకస్వరూపమై
 పంచవస్తులమీరి—ప్రబలుచుండు
నఖిలకాయములకు—నాధారమూర్తియై
 ప్రబలునైవ్యాదుని—ర్భయాలుపిధము
జగములకేమూర్తి సాక్షిదృగ్భావమై
 త్రిభువనంబులమించి—దేజరిల్లు

గీ. నట్టిచిన్మాత్రలోక—విఖ్యాతమూర్తి
నిత్యసత్యాత్మనేనని—నెవ్వడెరుగు
నతడుసద్గురుడిద్ధాత్రి—నైచఖంగు
లీలహృద్వర్తి—మహానంది లింగమూర్తి. ౩౮.

సీ. బ్రహ్మాండత్రయము నే-బయలు సొప్పుననిల్వ
సంభవించెను విశ్వ-సముదయంబు
పూర్ణార్ణవము భంగి-పాలు పొందినేనుండ
షుమవేళకాలభం-గములు గలిగె
ఖమణిరీతిగ నేను-గలుగ మయూఖము
స్థలజగద్వస్తువుల్-వెలయుచుండె
సాక్షియైనదృష్టి-చాడ్పుననుండగ
కలరూపములభంగి-గలిగె జగము

గీ. సర్వదృశ్యము జలఘట-చయము భంగి
నై వెలుంగగ వాడ-నేననుచు నెవ్వ
డెఱుగు నాతడె సద్గురు-శివాకరముల
లింపహృద్వర్తి-మహానందిలింగమూర్తి. ౨౯.

సీ. సద్గురువాక్య—ప్రసాదానుభవయుక్త
మైనరహస్యబ్రం—హ్మంబు దెలిసి
నిర్వ్యాజమూర్తినై—నిత్యశాంతాత్ముడై
మిథ్యాప్రపంచ—దుర్మదజీరి
హాసగుయాగామిత—పూర్వకర్మంధనల్
వేదాంతచిద్వహ్ని—ప్రేల్చి త్రుచ్చి
తనువునప్రారబ్ధ—మనుభవమొందించి
దుఃఖసుఖంబాక—త్రోవగాంచి

గీ. నారకతురుపును లేక—ద్వ్యాప్తులం దిగి
సోహమను చుమిగుల—దాసోహమొరిగి
తిరుగు మోక్షాధికారుడీ—ధరణిలోన
శిలహృద్వర్తి—మహానంది లింగమూర్తి. 30.

సీ. సుజ్ఞానశస్త్రము—బ్రజ్ఞవింటనుబోసి
మానసాకర్ణాంత—మానఁదీసి
చలనచిత్తాసురు—దలద్రుంచినంసార
రణశేషమూనంద—రతినడంచి
స్వప్నంబుభంగి—విశ్వంబుదాక్షపించి
కల్లోలరహితపా—ల్కడలిగతిని
పరిపూర్ణతనుజెంది—ధరనిరాపేక్షత
కలలేనినిద్రగా—తలపుమరచి
గీ. కలదులేదనుభావంబు—కాయకుండి
రాగవంతుడుగాక—విరాగిగాక
మాన్యుడీరీతిధన్యుడై—మహిఁజరించు
లీలహృద్వర్తి—మహానంది లింగమూర్తి. ౩౧.

సీ. సాంఖ్యంబువివరించి—సాక్షియౌసద్గురు
మహిమనుతిం జెప్పి—మంత్రదీక్ష
తారకలక్ష్యంబు—దగనునీలస్ఫటిక
విద్యుల్లతికంస్మయ—వేదదీక్ష
కల్లోలులేని—సాగరమునభ్భంగిని
సంపూర్ణతనుజెంది—శాంతిబొంది
మషిక్రియాదుర్మోహ—మర్దోదరహితుడై
పరమసత్క్రియదీక్ష—భావమెరిగి

గీ. నిరతమీమూడుదీక్షల—నిర్మలుండు
కలలాసైనమవిశ్వంబు—తలపులుడిగి
మహినివర్తించిదైవ—సమానుదతడు
శీలహృద్వర్తి—మహానంది లింగమూర్తి. ౩౨.

సీ. భక్తివిజ్ఞానాత్మ—ముక్తి వధూమణి
ప్రత్యుక్త పద్ధతి—జొప్పడంగ
మాన్యులవలననే—మారకవింనంత
కంసంతమదిలోన—గలిగినంత
ఆద్యంతములరెంటి—సమరించిమదిజేర్చి
తిరగగూర్చిన యామరి—స్థిరముజేర్చి
రామకవీంద్రుని—రచితంబునీసీస
పద్యముల్ ద్వాత్రింశ—భావములర

గీ. బుధులుతమమదిభావించి—మొదలుతుదియు
మానసంబునశివయోగ—మహిమగాంచి
ప్రియముగాతప్పుదిద్దుడీపెద్దలార
లీలహృద్వర్తి—మహానంది లింగమూర్తి. 33.

# వత్త్వలదర్పణం.

సీ. శ్రీశైవయోగీశ్వ—రేశ్వర శేవ్యమై
  నణువుకుపరమాణు—వైనదెద్ది
కమలభవాండత్ర—యమునిర్మితము జేసి
  కబళించినమయగా—గలదునెద్ది
కాలకర్మక్రియా—కర్తృభోక్తృత్వమై
  కర్తృభోక్తృత్వముల్—గానిదెద్ది
ఘటనాదఘటన—సంఘటితపటుత్కటు
  ఘటపటాదులయందు—నటనమెవ్వ

గీ. దట్టివస్తువనీవని—నాత్మదలచి
పొవ్వమథవువెంనసీస—వదాన్యనుసరణి
నర్పణము జేతువత్త్వల—దర్పణంబు
శిలహృద్వర్తి—మహానంది లింగమూర్తి.

సీ. అవనిజలానల—పవనమాకాశము

ఖ్యంబైనభూతముల్—గానినాడు

వేదాగమపురాణ—చరితశాస్త్రేతిహా

సానుగతార్థముల్—గానినాడు

ఆదిత్యగ్రహతార—కాబ్దసంకలితార్థ

కాలచక్రంబును—గానినాడు

దేవమానవరుషి—తిర్యగాధమసము

త్కృటజీవసంఘముల్—గానినాడు

గీ. కమలభవవిష్ణుపశుపతి—గానినాడు

పూనిముల్లోకభువనముల్—గానినాడు

గలిగియుండినదిలింగంబు—గగనభంగి

లీలహృద్వర్తి—మహానంది లింగమూర్తి. ౩౨

సీ. అవికారమచ్యుత-మద్వంద్వమమలము
జరమశేషమువాఙ్మ-చరమతర్క్య
మాద్యంతశూన్యంబ-మతులనిరంజన
నిత్యసత్యవిశుద్ధ-నిరుపమంబు
నిర్విశేషానంత-నిరుపద్రవనిబద్ధ
నిబిడీకృతానంద-నిర్భరంబు
సర్వచైతన్యంబు-నిర్వాణమవ్యయ
సర్వాధికార-ప్రశస్తమైన

గీ. వస్తువాక్కోటిపరిపూర్ణ-వార్థిభంగి
మొనసియుంనదినందుల-మొదలుతుదియు
నాకరములేనిలింగ-దేహంబుదోచె
లీలవ్యాద్వర్తి-మహానందిలింగమూర్తి. 3.

సీ. ఆలింగదేహము—దాదిచేతన్యంబు
భావలింగంబయ్యె—బ్రణుతికెక్క
ఘనస్వతరెండవ చే—తన్యంబుప్రాణలిం
గంబయ్యెసంయమి—గణముమెంన
గరిమించుమూడవ—చేతన్యమిష్టలిం
గంబయ్యెనిభూత—కలుషవిదులు
నెట్లంసబిందువు—యిష్టలింగంబయ్యె
నానాదుప్రాణలిం—గాఖ్యమయ్యె
గీ. కదగిచిత్కళభావ—లింగంబుదెలియ
వలయునివశక్తియుక్తులు—వదలనాకట
రెంటమూడింటలింగమూర్తి—నినదాల్చె
లీలనాద్వర్తి—మహానందిలింగమూర్తి. ౪.

సీ. అరుదెలదృగ్గ్రాంహ్యై—సకలస్వరూపమై
కరముద్ధియష్ట—లింగంబునొప్పు
చారుమనోగ్రాహ్య—సకలనిష్కళరూప
మై ప్రాణలింగంబు—నలరుచుండు
నెంమిః భావగ్రాంహ్య—నిష్కళాకృతిభావ
లింగంబు పెర్మి—జెలంగుచుండు
స్వప్నమై బాహ్యమం—దిష్టలింగమునుండు
లీలనంతరప్రాణ—లింగమునికి
గీ. కవళిబహిరంతరంబుల—భావలింగ
మూర్తి వెలుగొందు శ్రీగురు—మూర్తి హిత
తంములనుగొల్చి శ్రీప్రసా—దంముగానగ
లీలహృద్వర్తి—మహానంది లింగమూర్తి. ౫.

సీ. అతులదేహప్రాణ—మాత్మభావంబుల
త్రివిధలింగములని—తెలియవలయు
విధివత్క్రియామంత్ర—వేదదీక్షలనంగ
త్రివిధలింగములని—తెలియవలయు
పాలుపొందప్రకృతిని—పురుషుడీశ్వరుడన
త్రివిధలింగములని—తెలియవలయు
శుద్ధప్రసాదంబు—సిద్ధప్రసిద్ధాఖ్య
త్రివిధలింగములని—తెలియవలయు

గీ. బిందునాదంబుచిత్కళప్రియముతోడ
త్రివిధలింగములనిబుధుల్—తెలియవలయు
నిష్టలింగాదిననుభవ—మెంచివరుస
లీలహృద్వర్తి—మహానంది లింగమూర్తి. ఉ.

సీ. త్రివిధలింగమ్ములు—ద్వివిధలింగములయ్యె
నిలనాశ్క్రటాశ్క్రటీ—నెట్లటంస
నాచారగురులింగ—మయ్యెనిష్టమునందు
శివలింగచరలింగ—భవము ప్రాణ
మందుప్రసాద—మహాలింగములు రెండు
గలిగె మహాభావలిం—గంబునందు
భూతేశుడియ్యార్య—బొప్పెటువిభజించి
రజితాద్రియందు—పార్వతికి జెప్పె
గీ. గానలింగోద్భవంబుల—గణనజేసి
నంగములయందు నరయుట—ననుభవంబు
ప్రొదమిశరణాలునివిబుద్ధి—పొందవలయు
శిలహృద్వర్తి—మహానంది లింగమూర్తి. ౭.

సీ. అంగముల్ త్రివిధంబులని—వచించెను శంభు
డాకీతి నెట్లంన—నానుభవంబు
శైవయోగుల కెల్ల—స్వానుభవంబిచ్చు
కతనయోగాంగముగ—స్తుతి వహించె
శివయోగిభోగ—సంసిద్ధి వహించుట
కతన భోగాంగముగ—స్తుతి వహించె
ధర్మార్థ కాముముల్—త్యాగించుటందుల
కతన త్యాగాంగముగ—స్తుతి వహించె

గీ. గాసనీమూడుసంగశా—స్త్రాలు గణించి
శరణుపరిణాముఁలుంగై—సత్యశాంతి
ప్రాజ్ఞ విజ్ఞానమున బుద్ధి—పొందవలయు
లీల హృద్వర్తి—మహానంది లింగమూర్తి ౮.

సీ. శ్రీమద్భవత్కటా-క్షామృతప్రాప్తికై
సిద్ధకర్తవరుల-సంనిధికి జేరి
చరణారవిందముల్-శిరమునసోకగ్రాల్కొ
తత్పాదధూళియా-దలధరించి
దాతదైవముతల్లి-దండ్రిసద్గురుమూర్తి
కారణాచార్య-శంకరుఁడవనుచు
దయబుట్టబల్కి-యాదరత దీవెనలంది
వారిబోధా-మరత్వంబువలన

గీ. కంటినరగంటిదృష్టి-నింనంటిపెనగ
వింటిప్రణవంబుముక్తిచేకొంటినీకు
శతకమురచింపకోరకొంటి-సంతసమున
శ్రీమహానందిలింగ-దుష్కృతవిభంగ ౧.

సీ. వందనంబగజా—కృన్మందిరాంతర్వర్తి
వందనంబవ్యయా—నందమూర్తి
వందనంబబ్జ—భవాదిసంనుతకీర్తి
వందనంబమల—సత్త్వానువర్తి
వందనంబుభక్త—వరదాయకస్ఫూర్తి
వందనంబఖిల—విశ్వాధికర్త
వందనంబరివర్గ—వంచనాపహర్త
వందనంబపవర్గ—వనితభర్త

గీ. వందనంబుప్రమేయ—సర్వాంతరస్థ
వందనంబుదయామృత—స్వాంతభరిత
వందనంబుపునఃపున—ర్వందనంబు
శ్రీమహానందిలింగ—దుష్కృతవిభంగ.

సీ. భక్తపరాధీన—భవవిముక్తజ్ఞాన
ధ్యానసంధానహృ—త్సంనిధాన
దీనజనాథయా—దానకీర్తివధాన
దీనజనార్తి—వితానహరణ
జగదధిష్ఠాన—గజాజినపరిధాన
యసమానమృత్యుంజయాభిధాన
సగుణప్రధానతత్త్వ—నిధానసచ్చిదా
నందవిగ్రహాకరు—ణాలయాధి

గీ. శివశ్రీకంఠనిరంజన—నిరుపమాన
మానిహృత్పద్మభృంగాయ—మాసయుతస్త
దంకితంబుగ సీస—పద్యములు జేరు
శ్రీమహానందిలింగ—దుష్కృతవిభంగ. 3.

సీ. ఘనశరీరాదుల–కంటె శ్రోత్రాదింద్రియములు
శ్రేష్ఠములింద్రియ–ములకంటె
మనసు శ్రేష్ఠతమంబు–మనసుకంటెను నిశ్చ
యాత్మకబుద్ధి–ముఖ్యంబు యాత్మ
యా బుద్ధికంటెను–వ్యతిరిక్తమై సాక్షి
యై యున్నదదిపర–మాత్మయట్టి
పరమాత్మ నెఱిఁగియే–పట్టున తనచేత
మనుమనస్సునలెస్స–గా గ్రహించి

గీ. భూరిదుఃఖంబుచేతను–పొందదగిన
కామమనుశత్రురూపంబు–కడువధించి
యనుభవజ్ఞానసంపన్ను–డైనయోగి
శ్రీమహానందిలింగ–దుష్కృతవిభంగ. ౯

సీ. ఇంద్రియంబులు—విషయేంద్రియంబులయందు
సంచరింపుచునుండ—సంతతంబు
తనమనంబేపురు—షునిచేత నియమింప
బడక ప్రవర్తింప—బడియెనేని
పూనియమ్మనసుయా—పురుషునియొక్క నా
త్మానాత్మసువివేక—మునుండనీక
జలములందున నావ—నిలువనీయని ప్రతి
కూలవాయువురీతి—బోలెనరవ
గీ. జేరనీక నాకర్షించు—కారణమున
షుకేసిసకలేంద్రియంబుల—సంగ్రహించి
పరశివాసక్తుఁడగును—సద్భక్తుఁడెపుడు
శ్రీమహానందిలింగ—దుష్కృతవిభంగ. ౧౧.

సీ. కామంబు మోక్ష—మార్గంబు చింతించుట
క్రోధంబు వికృతితే—కువశ మాఁగు
లోభంబునాత్మ—నిష్ఠాభిజ్ఞత చెఱించె
మోహంబు భక్తి—నిర్మూలనగించె
మదము నీగాఁ—దేహమాత్రంబు లేదను
మాత్సర్యమొందె—నేరముంబు పాటము
శత్రుషడ్వర్గంబు—మిత్రవర్గంబైన
మానవజన్మంబు—మంచిదాయ
గీ. యిట్టి మహిమయు గాయుండు—నేమి కార
ణమున నింపించితివి మహా—నాట్యశీల
సత్క్రియాధార మునిజన—సాంత్వనలోల
శ్రీమహానందిలింగ—శేషభూషణాంక. ౧౮.

సీ. సద్గురువాక్యంబు—శాస్త్రదృష్టాంతంబు
యాత్మనిశ్చయమైన—యనుభవంబు
గురినిల్ప త్రివిధంబు—గుదిరియొక్కటియైన
యదియపో పరమార్థ—మండ్రుబుధులు
గురిలేని శాస్త్రార్థ—గౌరవవిద్యలమండ్రు
గురువు లేకను గురి—కుదురుపడదు
వాక్యంబు దెలియ—నేర్పాటు నంతర
మాంతరస్థి మెఱిగిన—యనుభవంబు
గీ. గాంచి గురినిల్ప నేర్పు—విజ్ఞానదృష్టి
గలిగి వాత్మానుభవుడైన—మనుజుడట్లు
గురుని సేవింపవలె—ముముక్షుండు మొదలు
శ్రీమహానందిలింగ—దివ్యకృపాంగ. ౧౫.

సీ. మదిసిసంపదల్ — మరుపుర్థి గలరీతి
కడుయావనంబు — మేఘంబుభాతి
బంధువుల్ సద్యా — గతేంధనంబులభంగి
కామినీకూటంబు — గాలిపోల్కి
అవగుణమచ్చర — వ్యవహారజాలంబు
సత్తపౌర్వ్యలకొమ్ము — లెన్నినట్లు
జలబుద్బుదముకంస — మలకనకాయంబు
రెమ్మెలయిదియెల్ల — నమ్మువారి
గీ. భావమెఱునవచ్చు — దుర్భావలందు
బడుమవేమచునుందురె — ప్పాటసైన
నొప్పరై శాశ్వతముగతి — నుర్వియందు
శ్రీమహానందిలింగ — దివ్యామృతాంగ. ౧౬.

సీ. స్థూలకాయమున—రజోగుణయుక్తుడై
రాజీవభవుడు—జాగ్రతయొసఁగు
సూక్ష్మకాయమున—విష్ణుండుసాత్వికగుణ
సహితుడైస్వప్నంబు—సల్పుచుండు
కారణదేహంబు—గదసితమోగుణ
వ్యాప్తిరుద్రుండు—సుషుప్తిఁజేయు
విశ్వజన్మస్థితి—విలయంబులీరీతి
బ్రహ్మవిష్ణుమహేశ్వ—రాత్మకముల

గీ. కృతములైయుండుగాన—నీకృతముదేది
యెవ్వఁడవునీవునీకు—పేరేమిరూప
మేమదియటంచుదొరిగి—భజింతునాత్మ
నశ్వరకళాంగ—శ్రీమహానందిలింగ. ౧౮.

